# గీతావాణి

నాల్గవ సంపుటము  ద్వితీయ సంచిక

[illegible]


శ్రీగీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 మార్చి 1955.

# విషయసూచిక.





# " గీతావాణి "

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్:

శ్రీ రామకృష్ణ

మేనేజరు:
స్వామి శ్రీశివానంద,


గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా 4—0—0 * విడిప్రతిక 0—6—0

15th MARCH 1955.

# గీతాగానము.

## కీ॥ శే॥ డాక్టర్ రంగా చిన్నచలమయ్యగారు, చాగలమఱ్ఱి.

[ 1954 నవంబరు సంచిక 2_వ పుట తరువాయి ]

8. నాలుగువర్ణములవారు, నానాగుణకర్మలచే పూర్వజన్మ పుణ్యముతో బుట్టిరి,
జన్మలన్నియు నేనేజేసితి, జన్మలకు నేను కర్తనుగాను, కర్మసాక్షి నేనేయని.
కర్మఫలము నాదేయని, తెలివితోడ తెలిసినవారికి ఫల్గుణా ...
కర్మబంధమూ లేదయ్యా, – కర్మఫలమునే యాశించరుగ
కామములేనీయోగమే – ఇదిరో తెలియుము పార్థివా ॥జ్ఞా॥ (శ్లో॥ 13,14)

9. నీకన్నముందువారు, నీవిధముగ నాచరించిరి, వారివలెనే నీవుచేసి వర్ధిల్లుము,
కర్మ అకర్మ భావములను, కనుగొనుట సాధ్యమాన పండితాగ్రగణ్యులకైనను,
సంసార సంబంధమునుండి ముక్తిగలుగు కర్మనే దెలిపెద ఫల్గుణా ...
జ్ఞానయోగమె తెలిసిననూ – వారేధన్యులు పార్థివా ॥జ్ఞా॥ (శ్లో॥ 15, 16)

10. కర్మ వికర్మ అకర్మయని మూడున్నవి, శాస్త్రవిహితకర్మనే జేయుమా,
కర్మయందు అకర్మయును, అకర్మయందు కర్మమును, చేయుము ఫల్గుణా...
జ్ఞానముతోడా కర్మలూ – చేసినవారే యోగులు
తెలిసినవారే ధన్యులూ – చేసినవారే పుణ్యులూ ॥జ్ఞా॥ (శ్లో॥ 17, 18)

11. జ్ఞానముచే కర్మయోగి, జ్ఞానాగ్నిని రగులుకొలిపి,కర్మసంబంధమును కాల్చివేయుగా
కర్మఫలమను యాశనువదలి నిత్యానందుడై చేయుకర్మ అకర్మయగును ఫల్గుణా...
విషయవాంఛలూ విడిచిననూ – పాపములంటవూ పార్థివా ॥జ్ఞా॥ (శ్లో॥ 19,20,21)

12. దేహాభిమానమువదలి, ఫలాపేక్షనువదలి, తృప్తినిజెంది కర్మనుజేయువాడు,
అకర్మచే బంధింపడు ఫల్గుణా ...
లోకముకొఱకే కర్మలూ – దేహముకొఱకే కర్మలూ
చేసినవారే ధన్యులు – తెలిసినవారే పుణ్యులూ ॥జ్ఞా॥ (శ్లో॥ 22, 23)

13. యజ్ఞకర్త యాగభోక్త అంతయు బ్రహ్మమయమేయనుచును బ్రహ్మమును
బొంది బ్రహ్మయగును జ్ఞానియె, కొందఱు కర్మయోగులు, ఫలాపేక్షతో
దేవతోపాసనలు చేయుచుందురు కొందఱు జ్ఞానులు ఆత్మచేతనె ఆత్మ
యందు యజ్ఞముచేసి జ్ఞానులైరి, కొందఱు జ్ఞానేంద్రియముల నిగ్రహించె
దరు, కొందఱు విషయసుఖంబుల విడిచెదరు ఫల్గుణా ...
వానివానీ పనులనూ – లయమును జేతురూ జ్ఞానులూ ॥జ్ఞా॥(శ్లో॥ 24, 25, 26, 27)

14. ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము, పారాయణయజ్ఞము, జ్ఞాన
యజ్ఞము, ఇంద్రియనిగ్రహాత్మయజ్ఞము. వారువారే చేయుచుందురు ఫల్గుణా ...
దానముకొఱకే ద్రవ్యమూ – ధర్మముకొఱకే యజ్ఞమూ ॥జ్ఞా॥ (శ్లో॥ 28)




సంపుటి 4 ★ స్వస్తిశ్రీ జయ – ఫాల్గునమ్ ★ సంచిక 9

# సర్వార్పణభావము.

భగవద్గీత చెప్పిన సమర్పణభావమే భాగవతధర్మమునకు పరమస్థితి. విశ్వమునందలి ప్రతియొక వ్యాపారమును, జీవితము నందలి ప్రతియొక వ్యవహారమును ఒకానొక ఏక సత్తావలన నిర్వర్తింపబడుచున్నదనెడి విశ్వాసనిష్ఠయె భాగవతధర్మము. నామరూపములపై ఆధారపడక – ఆధేయవస్తువులపై ఆధారపడక, సర్వాధారవస్తువుపై ఆధారపడి యుండుటయె భాగవతధర్మము. సర్వార్పణభావమును బొందక అది సిద్ధింపదు.

సర్వార్పణభావమనగానేమి? సమస్తమును భగవదర్పణము చేయుట – సమస్తమును అర్పించుచున్నానసెడి అహంకారమును సైతము అర్పించుట. అహంకారావరణ మూడక – అహంకారగ్రంధి తెగక భక్తుడూ కాలేడు; జ్ఞానీ కాలేడు. అన్నింటిని యివ్వవచ్చును; కాని యిచ్చువానినిచ్చుట మహాకష్టము. కర్మలను వదలను; కాని కర్తృత్వమును వదలుట కడుంగడు దుర్లభము.

బలిచక్రవర్తి మొదట దానమిచ్చినాడు, రెండవసారి దాతనిచ్చినాడు. దానమిచ్చుట కంటె దాతనిచ్చుటగొప్ప. ఇదే సర్వార్పణము.

సర్వార్పణభావమును బొందిన భక్తునియొక్క జీవితము నందలి ప్రతిపనియు సరాసరి యీశ్వరార్పితమై పోవును. సామాన్య జనులుచేయు పనులన్నియు – క్రియలన్నియు అహంకారార్పితము లగుచున్నవి. భక్తునకు అహంకారావరణములేదు. అట్టివాడు చేయు కర్మము – తిను ఆహారము – ఒనర్చు యజ్ఞము – యిచ్చుదానము – ఆచరించెడి తపస్సు, అనంత విశ్వశక్తికి అర్పితమై అపార ఫలదాయక మగుచున్నది. సాత్త్విక రాజసిక తామసిక రూపముల నొప్పారు, కర్మ ఆహార యజ్ఞ దాన తపస్సులు వానిసంపర్కముతో గుణాతీతదశను పొందుచున్నవి. కర్తృత్వమే లేనివానికి గుణముల బంధమెక్కడిది? ఈ సుగమసుందర వ్యవస్థాప్రక్రియను తొమ్మిదవ అధ్యాయము యిరవై యేడవ శ్లోకమున భగవద్గీత యెంతచక్కగా వర్ణించినదో చూడుడు.

"అర్జునా! నీవుచేయు కర్మము, సాత్త్వికమో రాజసమో తామసమో, ఆ సుద్దితో నీకు పనిలేదు. నీవు తిను ఆహారము, యే గుణమునకు చెందినదనెడి గొడవ త్రవ్వుకోవద్దు. అట్లే నీ యజ్ఞ దాన తపస్సులుకూడా యే గుణాత్మకములోయని చింతింపబనిలేదు. కాని వీనినన్నిటి సర్వార్పణ భావముతో – నిరహంకారబుద్ధితో – కర్తృత్వాభిసంధి వదలి, చేయుచున్నావో లేదో పరిశోధించు కొనుము, పరిశీలించుకొనుము. అహంకారముతో కూడినది అమృతమైనను విషమే; అది జన్మబంధమునకు కారణము. ఈశ్వరార్పణ బుద్ధితో కూడినది (లోకదృష్టికి) విషమైనను అమృతమే; అది మోక్షదాయకము.

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్॥"(9-27)






[ గత సంచిక 12-వ పుట తరువాయి. ]

అధికారులైనవారు అనేక విధమగు యుక్తులతో ఉపనిషత్తుల యొక్క అర్థమును నిశ్చయించుటకు జ్ఞానయజ్ఞ మందురు.

"యతయః సంశితవ్రతాః" కొందరు యత్నపరులగు అధికార జనులు సంశితవ్రతమనెడి దృఢవ్రత యజ్ఞము నొనర్తురు. ఇట్లు ఈ శ్లోకమునందు ఆరుయజ్ఞములను గూర్చి ముచ్చటించి భగవంతుడు తర్వాతి శ్లోకమున ప్రాణాయామ యజ్ఞమును నిరూపించు చున్నాడు.

"అర్జునా! ప్రాణాయామ యజ్ఞ పరాయణులగు మరికొందరు ప్రాణాపాన వాయువుల గమనమును నిరోధించి, అపానమునందు ప్రాణమును ప్రాణమునందు అపానమును హోమము చేయుచున్నారు."

ఇచ్చట యోగశాస్త్ర పద్ధతిని బట్టి ప్రణాయామమన నేమో తెలిసికొనవలసియున్నది. ప్రాణవృత్తిని అపానవృత్తిని నిరోధించుటను ప్రాణాయామమందురు. ఈ ప్రాణాయామము రేచకపూరక కుంభక భేదములతో మూడు విధములు.



శరీరము లోపలనుండు వాయువును బైటికి వదలుటకు రేచకమనిపేరు. బైటిగాలిని లోనికి పీల్చుకొనుటకు పూరకమనిపేరు. ఊపిరిని వదలుట గాని తీసుకొనుటగాని లేక ఊరకుండుటను కుంభకమందురు. ఈ కుంభకము బాహ్యాకుంభకము — అంతర కుంభకమని రెండువిధ

ములు. శ్వాసను గ్రహించిన పిమ్మట దానిని విడువక లోపలనె ఆపి యుంచుటను ఆంతర కుంభకమం దురు. శ్వాసను వదలిన తర్వాత దానిని లోనికి గ్రహింపక బైటనె ఆపియుంచుటను బాహ్యకుంభక మందురు. శ్వాససహజముగ హృద యస్థానమునుండి బయలుదేరి నాసి కాగ్రమునకు పదిరెండు అంగుళ ముల దూరమువరకు పోవుచున్నది. శ్వాసను లోనికి పీల్చునపుడును అట్లే నాసికకు ద్వాదశాంగుళ పర్యంత దూరమునుండి గ్రహింప బడుచున్నది. అట్టియెడ నది హృద యస్థానమువరకు పోయి నిలుచు చున్నది. అనంతర మచ్చటినుండి వెలుపలికి బయలుదేరును. ఇది స్వాభావికముగ జరుగు ప్రాణగమ నము. ఈ గమనమును అభ్యాసము చేత క్రమక్రమముగ అభివృద్ధి నొం దించి, నాభినుండి కాని మూలా ధారమునుండి కాని ఊపిరి బయలు దేరి వచ్చునట్లు సాధింపవలెను. అట్లే బయటినుండి శ్వాసను లోనికి పీల్చు నపుడును ఆ శ్వాస ఆ స్థానములను ముట్టునట్లు అభ్యసింపవలెను. నాభినుండి వదలబడిన శ్వాస నాసికాగ్రమునకు యిరువదినాల్గు అంగుళముల పర్యంతము వ్యాపించ గలదు. మూలాధారమునుండి విడు వబడిన శ్వాస, నాసికాగ్రమునకు ముప్పదియారు అంగుళముల దూరము సాగిపోగలదు. అట్టియెడ లోపల గ్రహించునపుడును నాసికాగ్ర మునకు అంతే దూరమునుండి గ్రహింపబడుచూ నాభివరకు గాని మూలాధారము వరకుగాని వ్యాపిం చగలదు. శ్వాస దీర్ఘమై సూక్ష్మమై యుండునని దాని యర్థము. శ్వాస యెంతదూరము వ్యాపించుచున్నదని తెలిసికొనుటకు దూది పింజను ముక్కునకు సూటిగ పెట్టుకొని దాని కదలికను గ్రహించి నిశ్చ యించవలెను. శ్వాస పోయివచ్చు దూరమునకు దేశపరీక్ష యనియు, కాలమునకు కాలపరీక్ష యనియు పేరు. రేచించునపుడును పూరించు నపుడును కుంభించునపుడును ఓంకా రమును జపించుచు కాలపరీక్షను గుర్తించవలెను. జపసంఖ్యను క్రమ క్రమముగ పెంపొందింపవచ్చును. కుంభకమునందు కాలపరీక్షకు అవ కాశమున్నది కాని దేశపరీక్షకులేదు. ఈ విధముగ రేచక పూరక కుంభక రూపమగు ప్రాణాయామమె గాక మరొక్క విధమగు ప్రాణాయా మముకూడ గలదు. దానిని కేవల కుంభక మందురు. ముందుచెప్పిన

కుంభకము శ్వాసను గ్రహించిన మీదట లేదా వదలిన మీదట సాధ్యమగుచున్నది. కాని ఈ కేవల కుంభకమునకు రేచక పూరకములతో సంబంధములేదు. సామాన్య కుంభకమును అభ్యసించు కొలది నిది సిద్ధించుచున్నది. ఈ అభ్యాసమునకు 'ధారణ' యనిపేరు. రేచక పూరకములతో సంబంధము గల కుంభకము నిద్రామాంద్యాది రూపముల పరిణమించు అవకాశముండును. కాని కేవల కుంభకమునందాపరిస్థితిలేదు.

ఏ సాధనను అవలంబించి ప్రాణశక్తిని తన స్వాధీనము చేసికొన వీలుండునో దానినె ప్రాణాయామ మందురు. ఈ విషయమునె పతంజలి మహర్షి "తస్మిన్ సతి శ్వాస ప్రశ్వాస యోర్గతి విచ్ఛేదలక్షణః ప్రాణాయామ ఇతి" అని చెప్పియున్నారు.

ఆసనము స్థిరమైన తర్వాత ప్రాణాపానముల గతి నిరోధమే ప్రాణాయామ స్వరూపము.

(సశేషము.)

గీత యోగేశ్వరుడైన శ్రీ కృష్ణుని యోగబుద్ధియొక్క చమత్కారం. పతిత దళిత – జీర్ణ శీర్ణ – దీన హీన ప్రాణి కోట్ల జీవనాడులకు గీత జవసత్త్వాలను చేదిపోస్తుంది. ప్రత్యేక యుగసమస్యల నది పరిష్కరిస్తుంది. గీతామృతరసంతో తనుమనః ప్రాణాలను ఆప్యాయత పొందించిన వారికి తక్కిన రసాలు ఎందుకూ కొరగావు.



# కర్తవ్యాధికారః.

రచన:— సాహిత్యరత్న శ్రీ బుద్ధివల్లభశాస్త్రి

అనువాదం:- శ్రీ V. లక్ష్మీనరసింహయ్య, హిందీ పండిట్ - ఆళ్లగడ్డ.

ఒక పనిచేయువాడు కర్తయని పిలువబడును. అతడు చేయుదానిని "క్రియ" యందురు. ఈక్రియచేత నేఫలమేర్పడునో దానిని "కర్మ" యందురు. కర్తయొక్క క్రియాఫలము కర్మయగుచున్నది. కర్మ సామాన్యము, మధ్యమము, ఉత్తమమను భేదములుగా నుంటున్నది. తనకు తనజాతికి సంబంధించిన కర్మ సామాన్యకర్మయందురు. స్వజాత్యేతర (ప్రాణిమాత్ర) సంబంధమగు కర్మ యుత్తమము. సామాన్య కర్మముల ఫలము సాధారణమైనదియు, స్వార్థపూర్ణమైనదియు నగుచున్నది. ఇందజ్ఞానమధికము. ఇంద్రియముల వృత్తి బహిర్ముఖమగుటచే వాసనాజాలమందు కట్టుబడియుండుట నైసర్గిక గుణము. దానియొక్క కార్యములు దాని ఫలము శరీరమే యనుభవింప వలయునని కోరును. ఇట్టి కర్మ చేయువారు, స్థూలమైనట్టియు, సరళమైనట్టియు, పదార్థములందే యాసక్తి నుంచుదురు. ప్రపంచమున నిట్టి కర్మ చేయువారి సంఖ్య యధికము.

మధ్యమకర్మ చేయువారిలో స్వార్థభావన యుండియుండును, పరార్థభావన యధికముగా నుంటున్నది. ఇట్టి కర్మ చేయు పురుషులందు సత్వగుణ ప్రధాన మేర్పడినట్లయిన వారెక్కువ గంభీరులుగను, మననశీలురుగను యగుచున్నారు. రజోగుణ ప్రధానమగుచో సుఖముల వైపు పరువెత్తుదురు. కాని యిట్టి పురుషులు తమ స్వరూపమును మరవరు. ఒకవేళ మరచినప్పటికి తిరిగి జాగ్రత్తపడుదురు. తిరిగి వారు జాగరూకులై తమమార్గమును, కర్తవ్యము ననుసరించుదురు. ఇందులో జ్ఞానపిపాసకును, సమాజకల్పనయొక్క భావనకును యవకాశ మెక్కువగా నుండును. సమాజమున కధికముగా కల్యాణమును గలుగునట్టి కర్మల యందు వారెప్పుడు ముందంజవేయువారుగా నుందురు. వారికి యశఃకీర్తి పతాక నాలుగు వైపుల విస్తరింపవలయునని యుద్దేశ్యము. ఇట్టివారు సమాజములో నేకొద్దిమందియో యుందురు.

ఉత్తమ పురుషులకర్మ మహత్తరమైనది. వారి యాదర్శము వర్ణించుట కలవిగానిది. ఇట్టి మహాపురుషుల యావిర్భావము సంయోగవశముచే నప్పుడప్పుడు సంభవించును. వారు త్రిగుణరహితులును, వాసనారహితులుగను నుందురు. వీరికి సజాతీయ విజాతీయ ప్రాణిభేదము లేదు. వారు "ఆత్మవత్సర్వభూతేషు" అన్నట్లు సమస్త ప్రాణులను తమ యాత్మవలెనే చూచునట్టి యనుభవము గలవారు. ఈవిధముగా త్రివిధ కర్మాధికారము ప్రతిమానవునకును

గలదు. వాడు దాని నుపయోగింపనీ, యుపయోగింపకపోనీ, యది వాని యిష్టము. కర్మానుసారముగా, తన, తనజాతి మరియు ప్రాణిమాత్రమందు స్పష్టముగను, ప్రభావాత్మరూపముగను, కర్మ జరుగుటకనుపడుచునే యుండును. ఈవిధముగా ప్రతిమానవుడును ప్రతిక్షణము కర్మ చేయుచున్నాడు. కాని పైచెప్పబడిన కర్మ భేదములయందొకవిధమైన వైజ్ఞానిక విచక్షణయున్నది. ఒక కర్మఫలము తనయందే యుండును. రెండవది తననుండి బయటకు వెళ్ళి స్వజాతి ప్రాణిమాత్రమందు దిగుచున్నది. మూడవ దాని ఫలము ప్రతిప్రాణిమాత్రమందును కనబడుచున్నది. ఈవాక్యములయందు స్వఫలమూలక కర్మయందొక సంకీర్ణత యుండుననువిశేషత్వము గోచరించుచున్నది. స్వజాతి మూలకమగు కర్మ యుదారముగాను, విస్తృతముగాను గన్పించును. దీనియందు స్వసంబంధీకర్మభోగమగుచున్నది. స్వజాత్యేతరమందు ప్రతి ప్రాణికొఱకు కర్మ ప్రధానమగుచున్నది. మిగత వన్నియు గౌణములు.

ఇప్పుడు "తమతమ జాతియొక్కయు, ప్రతిప్రాణియొక్కయు విలక్షణానుభవమగు కర్మరూపమేమి?" యనుప్రశ్న యుదయించుచున్నది. మనమిప్పుడు క్రియలవైపు పరుగెత్తవలసియున్నది. కర్మ కెన్ని క్రియాభేదములుగలవో యన్నియు క్రియ యందంతర్హితముగా (దాగొని) యున్నది.

ఫలరూపము సాధారణ సమాజమందు నానందానుభావకముగానిచో దానిఫలము కర్మకును, సుఖదాయకముగా



నేరదు. ఎందుకనగా నెంతెంత యధిక, లోక కల్యాణభావనానుసారముగా కర్మ చేయబడుచున్నదో అంతంత నధికమగు నుత్తమమైన సాధనములను గ్రహింపవలసియుండును. దీనినిబట్టి యపవిత్రకర్మలను దూరము చేయుటకు సాధుత్వముతోనే పని జరుగుననుట యంత యుక్తముగాతోచదు. దానికొఱకు విశేషమైనట్టి యవసరము, మరియు సమాజమందు 'విషస్యవిషమౌషధమ్' అనుటనుబట్టి యపవిత్రసాధనములగూడా గ్రహింపవలసివచ్చును. విషముచే విషశమనముచేసి దాని శుద్ధావస్థయందు పవిత్రసాధనముల నుపయోగించుటచే నుత్తమవ్యక్తి సమాజనిర్మాణమేర్పడును. సమాజావస్థ యుత్తమసమాజయోగ్యముకానిచో నుత్తమ సాధనముల ప్రయోజనము నిరర్థకమగును. పుత్రుడు గలుగుటకు తల్లిదండ్రులు కారణభూతులగుచున్నారు. అధికాంశముగా తల్లిదండ్రుల శారీరిక, మానసిక గుణముల ప్రభావము స్వాభావికముగా పుత్రులపైబడును. అదేవిధముగా క్రియామూలక గుణదోషముల ప్రభావము కర్మయందు. ప్రకృతిసిద్ధము. సత్పుత్రుడు కావలయునన్న సన్మాతయు నావశ్యకమనునది స్వాభావికము. ఇప్పుడు దోషోపశమనమైన తరువాత పవిత్రసాధనములు కావలయునన్న ప్రశ్నయెదుట గోచరించును. ఇట్టి యవస్థయందు దోషోపశమనము మిక్కిలియావశ్యకమైయున్నది. అటు తరువాత శుద్ధావస్థయందు "యోగః కర్మసు కౌశలమ్" అను వాక్యముచే యోగము నిర్దిష్టమగుచున్నది. దోషోపశమనము తరువాత కర్మయోగకుశలత్వమత్యావశ్యకము.

కాని కర్మయోగ కుశలత క్రియాయోగ కుశలతయందే సంభవము. కాలము, అర్థము, కర్మము, మరియు క్రియలయందతియోగము కూడదు. అయోగము కారాదు. భ్రాంతి యోగమును కారాదు. ఇట్టి యవస్థయందే యిది సంభవము.

(1) కాల, క్రియాసమయానుసారముగా కార్యముచేయునట్టి ప్రణాళికయున్నది. అందులో సమయము, ప్రకృతి, యవస్థా మొదలగు భేదము లేర్పడుచున్నవి.

(క) సమయము, రాత్రింబవళ్ళు, సంధ్య యని రెండు భేదములు.

(ఖ) శీతము, ఉష్ణము, వర్షము యని ప్రకృతిభేదములు మూడు.

(గ) బాల, వృద్ధ, యువాయని యవస్థా భేదములు మూడు.

(2) అర్థక్రియతో జ్ఞానక్రియను గ్రహింపవచ్చును. జ్ఞానక్రియ యైదు భేదములు. చూచుట, వినుట, వాసనచూచుట, రుచి చూచుట.

(3) కర్మక్రియలచే కేవలము కర్మబోధమగునట్టి క్రియాగ్రహణ జరుగుచున్నది. దీనికిగూడా యైదు భేదములు. మాట్లాడుట, తీసుకొనుట, ఆనందము గ్రహించుట, మలవిసర్జనము చేయుట, నడచుట.

ఇదిగాక మనస్సుకు జ్ఞానేంద్రియమందు కూడా స్థానముగలదు. దానిచేతిలో జ్ఞానము మరియు కర్మక్రియల త్యాగము, నియంత్రణములయొక్క పూర్తిభారముంటున్నది. కాని, యీ నియంత్రణ త్యాగములందు, కాలము, అర్థము, మరియు కర్మయొక్క యోగమపేక్షితముగా నున్నది. వీనియొక్క యోగముచేతనే పూర్తిగా క్రియ, కళలయొక్క సముచ్చయ మేర్పడును. అన్యదోషములయొక్క యుపశమనము తర్వాతకూడ, కాల, అర్థకర్మయోగములచే కర్మ యేర్పడినట్లయితే యీ యవస్థయందు కూడ నుత్తమము మరియు మధ్యమశ్రేణికి జెందిన కర్మ జరుగుట సంభవముగాదు. ఎప్పుడీమూడింటియందు పరస్పరమున్నన దేవిధముగా నొక్కొక్క అంతర్వర్తియగు ప్రత్యేక విషయశాఖలయందు సామ్యావస్థ యుంటూయుండదో యంతవఱకు కర్మ కౌశలముగా నేరదు. ఉత్తమ కర్మసంపాదన కూడా కానేరదు. చలిరాత్రులయందు వృద్ధపురుషుడు స్నానముచేయకూడదు. ఒకవేళ చేసినట్లయిన వ్యాధిగ్రస్తుడు కావలసి వచ్చును. మరియు వైశాఖమాసపు, మధ్యాహ్నపు టెండలయందెవ్వరు తిరిగెదరో వారెంతవరకు బ్రతుకగలరు? ఇదేవిధముగా యొకవైపు కర్మక్రియ లధికముగా చేయవలసియున్న మరియొకవైపు జ్ఞానక్రియ లధికము. ఒకవైపు కర్మక్రియలనతి యోగముకాగా మరియొకవైపు జ్ఞానక్రియల యయోగమయ్యెను. రెండవవానికి జ్ఞానక్రియాతియోగమును కర్మయొక్క యయోగమును యగుచున్నది. దేనికి జ్ఞానక్రియయొక్క యుపయోగము యధికమగునో దానిచే దుఃఖమేకాదు. ఆక్రియనుగోరు నింద్రియమునుగూడా పోగొట్టుకొందుము. రెండవది మరియు యే కర్మ క్రియాశీలమగు నింద్రియము నధికముగా నుపయోగించుదుము. దానిలోను చాలా తొందరగా శిథిలతయు, మరియు నకార్యశీలత్వము

వచ్చుచున్నది. ఈవిధముగా నొకదానివృద్ధి రెండవదాని క్రమశోషణమగుచున్నది. ఒకటి బౌద్ధికము, రెండవదానికి శారీర హ్రాసమును, మానవజీవనమును నీరసము గాను చేయుచున్నది. ఇదిగాక భ్రాంతి యోగము చేగూడా శారీరకమును మరియు బౌద్ధికవికాసమునకవరోధము గల్గుచున్నది. మానవత్వ విభాగమునకు అర్థ కర్మ క్రియల సామ్యయోగము పొందుటత్యావశ్యకము. యోగము న్యూనాధిక్య మగుట సహజము. కాని పూర్తిగా నతి యోగము మరియు నయోగము మానవత్వము యొక్క వికాసమార్గమునకు బాధకములు. దీనితోపాటు కాలక్రియ సరిగానుండుటయు చాల నావశ్యకము. అట్లుగానిచో కాలము, మరియు క్రియావైషమ్యముచేతనూ యుత్తమ కర్మప్రాప్తిగానేరదు. కాలక్రియ యొక్క మహత్త్వము గొప్పది. ఏ సమయ మందేయవస్థయందే విధమైన క్రియయందెట్టి క్రియయొక్క యుచితోపయోగ మొనరింప వలయును. అనునట్టిది యెంతవఱకు యోగ కర్మ, మరియు నర్థము తోటికానేరదో, యప్పుడు త్తమక్రియద్వారా యుత్తమ కర్మ ఫలముయొక్క ప్రాదుర్భావ మసాధ్యము. ఈ మూడుక్రియలను శక్తియుక్త సామ్యావస్థయందు తెచ్చి యుపయోగించుకొనుటయే సాధనముల పవిత్రత. దీనిని దృష్టికోణ మందుంచుకొని వ్యక్తి, లేక సమాజము తన యొక్క, తనజాతి, మరియు ప్రాణిమాత్రల యొక్క సుఖానుభూతియొక్క కల్యాణ సామ్యమును యుంచవచ్చును. ఏ వ్యక్తి తన కల్యాణమొనరించుకొనజాలడో వాడితరుల కేమిచేయగలడు? పైన చెప్పబడిన మూడు విధములైన క్రియలయొక్క భోగము లెస్సగా ననుభవింపగలిగిన వాడే వ్యక్తి, కర్మకుశలుడు, మరియు కర్మయోగి. వాడే నిజమైన కర్మాధికారము గలవాడు. ఇటువంటి క్రియాశీలత గలుగు వ్యక్తియే తన సక్రియ కర్మలద్వారా ప్రాణిమాత్రలకు సౌఖ్యానుభూతిని గలిగించును. వాస్తవముగా ప్రాణిమాత్రలకేగాక, మానవమాత్రమైన కాలము, అర్థము, కర్మ, క్రియయొక్క అతియోగము, అయోగము, భ్రాంతియోగమును దూరముచేసి, ఎక్కడ మానవునకు మానవుడును, మానవుడుగానీ దానవుడుగానీ లెస్సయగు యోగమును స్థాపించుదుమో, అదియే మధ్యమమార్గము. అదియే భారతీయ యాస్తిక, నాస్తిక దార్శనికులకు సమ్మతమైనది. ఈమధ్యమమార్గమునే గీత యందు కర్మకౌశలమను పేరిట చెప్పబడినది. దీని యధికారము మానవునకే కలదు. ఇతరులకు లేదు.

— श्री बुद्धिवल्लभ शास्त्री,
काशी विद्यापीठ.



# ★ గీతాహృదయము. ★

రచన:— మందుల కోటయ్య.

"బీజమునందు వృక్షమిమిడి యున్నట్లు, యీ సృష్టి ఉత్పత్తికి పూర్వము నిర్వికల్పముగను, భేదరహితముగను నుండెను.పిమ్మట దేశం కాలం, నామం, రూపం — అను భేదము లేర్పడెను. ఈ పంచభూతములు అద్దమునందు పట్టణమువలె ఆత్మప్రకాశములో కనబడుచున్నది. యోగసిద్ధునివలె, ఇంద్రజాలకునివలె పరమాత్మ యీప్రపంచముయొక్క— ఉత్పత్తి, స్థితిలయములను కల్పించుచున్నాడు. నిద్రయందలి స్వప్నము వలె యీ ప్రపంచము కల్పింప బడినది — శ్రీ శంకరాచార్య — అనగా మధ్యకనబడునది కూడ — మొదట చివరకనబడని దానివలె — మాయా కల్పితమే. ఏల అనగా జీవరాసులకు ఆధారమైన ప్రాణశక్తి ప్రకృతిలోనుండి సశ్యాదులద్వారా వచ్చుచున్నది. జీవులకు లభించు గాలి, నీరు, నిప్పు, ఆహారము మానవ కల్పితములుకావు. అవి అవ్యక్త స్థానమునుండి అనాదిగా వచ్చుచున్నవి. అనగా జీవులు అస్వతంత్రమైనవి. ఏక్షణమునకు ఏది ఎల్లా సంభవించునో మన ప్రత్యక్షాను భవములోనే తారుమారగు చుండును. వ్యక్తి — తన ప్రయత్నముతో ఆహారాన్ని పండించినా — గింజను మొలకెత్తించి, తిరిగి అనేక గింజలగనో, కాయలగనో మార్చే శక్తి ఒక పరాశక్తియే. భగీరథ ప్రయత్నముచేసి పాతాళగంగను సాధించామంటే — భూమిపైనున్న మట్టిని తొలంగిచామన్న మాటే గాని అసలు నీటిని మనము సృష్టించలేదు. అలాగే ఆధునిక యంత్రములగు, రేడియో, విద్యుత్తు, ఆటంబాంబు మొదలగు పరిశోధనలు కూడా — అసలు ప్రకృతిలోనున్న పదార్థముల సంయోగ వియోగముల మార్పేగాని — అసలు పంచభూతసృష్టి ఎక్కడాలేదు. అవి సహజముగా లభించుచున్నవి. కాబట్టి — మధ్యవ్యక్తమయ్యే నామరూప ప్రపంచము స్థిరముగా కనబడుచున్నది. అసలు భూతసృష్టి పరమాత్మదే కాబట్టి యీ కనబడే ప్రపంచము, మాయా కల్పితముగా — పరమాత్మదేయని — "అధ్యా

స్సను అద్వైతిని ప్రతిపాదించాడు. — అందుచేతనే భగవానుడు — పౌరుషము, బుద్ధి, తపస్సు, బలము, కామము, అన్నము, ఔషదము, మంత్రము, మృత్యువు, వైశ్వానర మను జఠరాగ్ని, రసరూపమైన పంటలు, భూతములను మోయు భూమి, లోకమును ప్రకాశింపజేయు తేజస్సు — నేనే — అనుచున్నారు. "The so solid seeming world is but an air image over me the only reality" అని కార్లైల్ మహాపండితుడు ప్రవచించారు.

శ్లో॥ "అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ
తత్రకా పరిదేవనా॥"

మాయ యంటే - ప్రత్యక్షంగా యింద్రియ గోచరమై — పరిశీలించితే — యింద్రియానుభవానికి అందనిది. అనగా లేనిదానిని కల్పించుటయు, దానితో వ్యవహరించుట మాయయొక్క కార్యము. అంతేగాని సుప్రసిద్ధకవి శ్రీ శ్రీ గారు అన్నట్లు కార్మికుని నుదుట మీది చమటను ఎవ్వరు మాయగా చెప్ప లేదు. "Maya is statement of fact" అనడంతో అంధవిశ్వాసంపై స్వామి వివేకానందులు ఒక గొడ్డలి పెట్టుపెట్టారు. వేదాంతాన్ని తర్కంతోగాక ఆచరణతో బుజూ చేయడమే శ్రీ వివేకానందుని ప్రత్యేకత. సంకల్పములోను, మాటలోను క్రియలోను, పరిశుద్ధముగానున్న ఉపాదియందు దైవము సాక్షాత్కరించగల డన్నారు. అట్లు ఆచరించి అనుభవంగా ఉంటేనే దైవాన్ని నమ్మమన్నారు. అందుకనే భౌతిక దృష్టిగల పండిట్ నెహ్రూవంటి రాజకీయవేత్తగూడా శ్రీ వివేకానందుణ్ణి — అధునాతన మార్గదర్శి యన్నారు.

పొగచేత నిప్పు, మురికిచేఅద్దము ఆవరించి యున్నట్లు, కామునిచే రాగద్వేషములు ఏర్పడి పురుషుణ్ణి నశింపచేయుచున్నది. జ్ఞానమేతానని, మిగిలినదంతయు జడమేనని శ్రీ భగవానుడు అర్జునునకు సహేతుకముగా బోధించెను. ఫలాపేక్ష రహితముగా కర్మల నాచరించిన, అంతఃకరణ శుద్ధిగలిగి, విశ్వమంతయు ప్రేమమయముగను, ఈశ్వరమయముగను కనబడును. సంకల్పజాలముతో కూడుకొన్న మనస్సును సర్వశక్తి సంపన్నుడైన భగవంతుని యందుంచవలెను. అనగా భజించునపుడు, భుజించునప్పుడు, ఆలో

చించునప్పుడు, సౌందర్యమును చూచునపుడు, కర్మచేయునపుడు, ఇంద్రియములకు భోగము అనుభవ మగునపుడు అచ్చట భగవంతుని శక్తిగా ప్రతిష్ఠచేయవలెను. ఏల అన ప్రతిప్రాణిని పంచీకరణచేసిన భగవత్ అంశమగు అవ్యక్తములో లీనమగును. ఇట్లు యింద్రియ వ్యామోహం కనబడ్డ స్థానంలో మాత్ృ స్థానాన్నిప్రతిష్ఠించిన — సర్పము ముందు ముంగిసవలె-యింద్రియనిగ్రహముగలిగి మనస్సు శుద్ధికాగలదు. అప్పుడే దేహేంద్రియాదులు జడముగను, జ్ఞానమే తానుగను — జ్ఞాని యుండును. ఇట్టి స్థితికి భగవదనుగ్రహముచే వైరాగ్యము కలుగును. ఇది అనేకజన్మల సంస్కారము. ఇదియే గీతా హృదయము. జ్ఞానమనగేమి? కర్మ జ్ఞానములు సముచ్చయములా? కామ్యనిషిద్ధ కర్మలను వర్జించి, నిత్యనైమిత్తిక కర్మలను ఆచరించిన, మనస్సు చల్లబడి — సత్వశుద్ధిగలిగి జ్ఞానమేతానై జ్ఞాని ఉండగలడు. "తత్వమసి" అనునది బోధకాదు. అచ్చట వేదములుకూడ సన్యసించినవి. జ్ఞాని అది తానేనైనుండును. అరటిగెల వచ్చిన తరువాత చెట్టు ఎట్లు నశించునో — అట్లే జ్ఞానమే తానుగానున్న జ్ఞానియొక్క దేహేంద్రియాదులు జ్ఞానముచే భస్మమగును. పంచకోశములకు అధిష్ఠానమైన బుద్ధిలోనున్న తెలివి (చిదాభాసుడు చిత్ యొక్క ప్రతిబింబము) కూడ జడమే. ఏల అన దానికి వ్యాప్తి లేదు. జాగ్రత్తలోని తెలివిని — మనస్సుచే సంకల్పింప బడుచున్నది. అద్దము పోయినను, పగిలిపోయినను బింబమునకు మార్పులేదు. కాని ప్రతిబింబము — బింబముమీద ఆధారపడియున్నది. అంతే కూటస్థుడు మార్పులేని స్థానము. చిదాభాసుడు కూటస్థుని ప్రతిబింబము మాత్రమే. కాన అట్టి "చిత్" — జాగ్రత్త లోను స్వప్న, సుషుప్తులలోను (యీదేహం, యీప్రాణం కనబడ నప్పుడు) ఒకటిగానున్న ప్రకాశమే — జ్ఞానము. అట్టి స్థితప్రజ్ఞలక్షణము పరిశుద్ధమైన సత్వమునందే ప్రతిఫలించగలదు. అది ధనముచేతను, కర్మచేతను, ప్రజచేతను రాదు. ఒక్క త్యాగమే దానికి ప్రధానము. త్యాగములో స్వార్థము లేదు. అందుచే దేహాత్మదృష్టి పోవును. నిత్యనైమిత్యక కర్మలు, జ్ఞానమనే మేడ ఎక్కుటకు, మెట్లు వంటివి. మేడపైకి ఎక్కిన తరువాత —

( మిగత 24-వ పుటలో )

# * గీతలోని భక్తుని లక్షణము. *

— నిర్విషయానంద బ్రహ్మచారి.

భగవద్గీతలో భక్తియోగము చాలముఖ్యమైనది. ఈ భక్తియోగమునుగూర్చి శ్రీ వినోబా భావేగారొక మంచియుపమానమును జెప్పినారు. గంగానది హిమాలయము నుండి సముద్రములో కలియు పర్యంతము పవిత్రవంతముగనే భావింపబడుచున్నది. అయిననూ కొన్నిచోట్ల ముఖ్యతీర్థములు గలవు. అట్లే గీతాశాస్త్రమంతయు పవిత్రముగ నెన్నదగినదైననూ గంగానదిని కొన్ని స్థలములందు ముఖ్యతీర్థముగా నెంచబడినట్లు యీ భక్తియోగమును గీతలో ముఖ్యతీర్థముగా నెన్నదగునన్నారు.

ఈ భక్తియోగములో 13 వ శ్లోకము మొదలు 19 శ్లోకమువరకు భక్తుని లక్షణములు నిరూపించబడియున్నవి. 13 వ శ్లోకము మొదలుకొని అద్వేష్టాది కొన్ని భక్తి లక్షణములజెప్పి 14 వ శ్లోకాంతమున "యోమద్భక్తస్సమేప్రియః" అన్నారు. అనగా యెవడిట్టి లక్షణములు గలిగినవాడో వాడు నాకు ప్రియమైన భక్తుడు అన్నారు. ఇక్కడొక సూక్ష్మభావమున్నది. ప్రపంచములో నేను రామభక్తుడనని, నేను కృష్ణ భక్తుడనని, నేను శివభక్తుడనని, నేను నారాయణ భక్తుడనని, నేను యేసు భక్తుడనని, అనేకులు అనేకవిధములుగా చెప్పుకొనుచుందురు. ఇక్కడ భగవంతుడు చెప్పిన వాక్యమును చూచినచో నేను భక్తుడనని చెప్పుకొనుట అనధికార ప్రలాపమగును. శ్రీ కృష్ణ పరమాత్మ యెట్టిలక్షణములు గలిగినవానిని నాకు ప్రియభక్తుడని చెప్పినాడో అట్టి లక్షణముల నలవరచుకొనుటయే కర్తవ్యముగా భక్తుడయినవాడు భావించవలెను. ఈ సందర్భములకు సంబంధించిన ఒక జరిగిన కథగలదు.

అరేబియా దేశము నందొకయూరిలో నిరువురు భక్తులు గలరు, అందులో నొక భక్తుడు జపధ్యానములజేయుచు కాలము గడుపుచుండువాడు. రెండవభక్తుడు శ్రీ కృష్ణ పరమాత్మ చెప్పిన ప్రకార మేప్రాణియందును ద్వేషములేనివాడై మిత్రభావముతో కరుణా భావముతో నిరంతరము సేవచేయుచుండెను. వారిరువు రొక్కొక్కసమయమున కలసికొని ధర్మవిషయములనుగూర్చియు, దైవవిషయములనుగూర్చియు నభిప్రాయ భేదములు కలిగినవారై పరస్పరము వాదించుకొనువారు. ఆ వాదములో నిరంతరము జపధ్యానముల జేయు భక్తుడు జపధ్యానములను జేయుటయే భగవద్భక్తుల కుండవలసిన లక్షణమనువాడు' రెండవ భక్తుండు సర్వము భగవంతుని స్వరూపము. కనుక లోకమును ప్రేమించి సేవించుటయే భక్తుని లక్షణ మనువాడు. వీరికి సరియైన మధ్యవర్తు లెవరును లభ్యపడలేదు. అందుచే నెవరిది సరియైన యభిప్రాయమో తేలలేదు.

ఇట్లుండ యొకనాడు మొదటిభక్తుడు జపధ్యానముల చేయుచుండెను. ఒక దేవదూత తెల్లని వస్త్రములధరించి యొకపుస్తకమును, యొకకలమును చేతబూని

ప్రసన్నముఖుడై వానియెదుట ప్రత్యక్షమాయెను. భక్తుడు మీరెవ్వరని ప్రశ్నించెను. నేను భగవంతుని దూతను దైవాజ్ఞచే భగవంతునిపై భక్తికలిగిన భక్తుల నామముల వ్రాసికొని పోవుటకు వచ్చితిననెను. ఆమాటలను విని యీ భక్తుడు తానంతకుముందు భగవద్భక్తుల లక్షణములగూర్చి వాదించువాడు. కనుక తాను భగవద్భక్తులలో చేరినవాడనో కాదో యను సందేహముతో నాపేరున్నదేమో పుస్తకము చూపుమనెను. ఆదేవదూత పుస్తకమును భక్తుని చేతికిచ్చెను. అతడాపుస్తకమును విప్పి మొదటి పుట తెరువగనే మొట్టమొదట తనపేరు పెద్దఅక్షరములతో లిఖింపబడియుండెను. అప్పుడతడపరిమితానంద భరితుడై తనస్నేహితుడగు రెండవ భక్తుని పేరున్నదో లేదోయని ఆపుస్తకమును కడవఱకు తిరుగవేసి చూచెను. తనస్నేహితుని పేరందు కాన్పించలేదు. ఆపుస్తకమును దేవదూతకిచ్చి నమస్కరించెను. దేవదూత యంతర్ధానమాయెను. జపధ్యానములు ముగించి యీ భక్తుడు మిత్రుడగు రెండవభక్తుని కలిసికొని, తనకు దేవదూత ప్రత్యక్షమయినపేరు భగవద్భక్తుల పేర్లన్నిటికంటే ముందుగా వ్రాసెననియు, మీ పేరు ఆపుస్తకమునందే లేదనియు చెప్పెను. ఆ మాటలనువిని రెండవభక్తుడు తనపేరు భక్తులసంఖ్యలో చేర్చలేదని కొరతజెందలేదు. ఏలననిన నిజముగా భగవత్ప్రీతిపాత్రుడగు భక్తుడు సంతుష్టుడై యుండవలయునని యున్నది. కనుక నిజమయిన భగవత్ప్రీతికి పాత్రుడితడు. పిమ్మట మొదటి భక్తునిజూచి అతడిట్లనెను. మీరు మరల నొకతరి ఆ దేవదూతను ధ్యానించి, ప్రత్యక్షమొనర్చుకొని, నాపేరు భగవద్భక్తులపేర్లలో దేనికి చేర్చలేదో అడుగవలసినదని చెప్పెను. దానికి మొదటి భక్తుడొప్పుకొని మరుసటిదినమట్లే జపధ్యానములచేయుచూ దేవదూతను ధ్యానించెను. దేవదూత వెంటనే ప్రత్యక్షమాయెను. ఈ భక్తుడు తనమిత్రుని పేరెందుకు భగవద్భక్తులలో పేర్లలో చేర్చలేదని యడిగెను. వెంటనే దేవదూత స్నేహితుడు భగవంతునిపై ప్రేమగలిగిన భక్తులలో చేర్చదగినవాడు కాడు. భగవంతునకు ప్రీతిపాత్రుడైన భక్తుడు. అందుచే భగవత్ప్రీతి పాత్రులగు భక్తులపేర్లు లిఖించు పుస్తకములో వానిపేరు వ్రాసినాను. ఇదిగో యీ పుస్తకమును చూచుకొనుమని యొకపుస్తకము చేతికిచ్చెను. ఆ పుస్తకములో తనస్నేహితుని పేరు మొదటిపేజీలో మొట్టమొదట పెద్ద అక్షరములతో లిఖింపబడియుండెను. అప్పుడాభక్తుడు నిజమగు భక్తిలక్షణముల గుర్తించెను. దేవదూతకు పుస్తకమిచ్చి నమస్కరించెను. దేవదూత యంతర్ధానమాయెను. మఱల తనస్నేహితుని చెంతకు వచ్చి ఈ విషయమును దెలిపి భగవత్ప్రీతి పాత్రుడవైన భక్తుడవునీవని యొప్పుకొని ఆ భక్తునివలె సర్వప్రాణుల ప్రేమించుచు కాలము గడిపెను. కనుక మన మెల్లఱము గీతయందు చెప్పిన భక్తిలక్షణముల నలవఱచుకొన్నప్పుడే భగవత్ప్రీతి పాత్రులము కాగలము. జన్మ తరించగలము. సర్వేశ్వరుడు తనకు ప్రీతిపాత్రములగు భక్తిలక్షణముల మనకెల్లఱ కొసంగుగాక! ఓమ్.

— నిర్విషయానంద బ్రహ్మచారి.

# * గీత - ప్రశాంతి ప్రదాత *

ఆచార్య శ్రీధర్

మానవునిలోగాని, సంఘంలో గాని, దేశంలోగాని, ప్రపంచంలో గాని అశాంతి అంతరించి ప్రశాంతి ప్రతిష్ఠింపబడాలంటే ఏం చేయాలి? అసలు శాంతియొక్క స్వరూపం ఏమిటి? అశాంతి అవతరణకు కారణ మేమిటి? ఆనందము శాంతికి నామాంతరము. ఆనంద స్వరూపుడే భగవానుడు. ఆనందస్వరూపుడైన భగవానునిలోనే శాంతి ఇమిడి నిబిడీకృతమైయున్నది. శాంతిదానికి అన్యపదార్థముకాదు. ఆ శాంతిని పొందటమే యథార్థ పదార్థ విజ్ఞాని యొక్క లక్ష్యం. ఆనందరహితమైన అజ్ఞానస్వరూపంలో శాంతికి స్థానం లేదు. అశాంతి అజ్ఞానభావ సముదాయ జనితము. అజ్ఞానంనుండి విజ్ఞానంలోనికి ప్రస్థానించడానికి సహకరించేదే భగవద్గీత. ప్రపంచంలో ప్రశాంతిని ప్రబోధించి ప్రతిష్ఠాపన జేయ ప్రయత్న మొనరించు ప్రజ్ఞానిధి యైన ప్రవర్తి గీతామాత. భగవద్గీత అసలు అశాంతి నిర్మూలనకే జనించింది. యుద్ధసన్నద్ధుడై మోహ ప్రవృత్తినందు చిక్కుకొని, నివృత్తిని గానని అశాంతియుత అర్జునుని హృదయంలో ప్రశాంతిని ప్రకోపింప చేయడానికి శ్రీకృష్ణభగవానుని ముఖయంత్రంనుండి అజ్ఞాన రహిత అమృత స్రవంతి ప్రవహించింది. ఆ జ్ఞానామృత రసాయన స్రవంతి అర్జునునిలోని ద్వేషాగ్నిని, మోహాగ్నిని ఆర్పివేయగలిగింది. ఆ జ్ఞాన స్రవంతే అర్జునుని నరనరాలలో ప్రవహింపగా అతనిలోని మోహాంనశించి యథార్థ జ్ఞానం లభించింది. అశాంతి అంతర్ధానమై, ప్రశాంతి ప్రత్యక్షమైంది. భగవద్గీతా ప్రవచనానంతరము అర్జునుడు యుద్ధమేగా చేసింది. యుద్ధమనే ఫలితమును చేకూర్చిన భగవద్గీత ప్రశాంతి ప్రదాయిణి ఎలా అవుతుందని ప్రశ్నిస్తారా? యుద్ధము అనేకార్యం రెండు కారణములవలన ఏర్పడుతుంది.

ఒకరి భావాలను ఒకరు అర్థంచేసికొనక శాంతికోటకు ప్రయత్నం చేద్దాం అనే భావనకూడ లేకుండ, రెండు కక్షలూ యుద్ధ సన్నద్ధులు

కావటం ఒక పద్ధతి. ఒక కక్ష ఆత తాయులు. వారివలన ఎక్కువమందికి హాని జరుగుతున్నది. మరొక కక్ష పరస్పరభావాలను సమన్వయపఱచు కొని, శాంతి ప్రతిష్ఠాపన కొఱకు ప్రయత్నించి విఫలమై యుద్ధానికి సంసిద్ధులు కావటం ద్వితీయపద్ధతి. సముచితమైన ద్వితీయ మార్గాను సారంగానే ధర్మక్షేత్రమైన కురు క్షేత్రంలో కేవలము ధర్మప్రతిష్ఠాపన కొఱకు యుద్ధం జరిగింది. ఆతతా యులు అశాంతికి కారకులు. ఆత తాయుల నిర్మూలనం అశాంతి నిర్మూలనమే అవుతుందికదా! ఈ ధర్మ యుద్ధంవలన శాంతి ప్రతిష్ఠా పనే జరిగింది. అందువలననే సర్వజ్ఞు డైన భగవానుడు ధనంజయుని ధను ర్బాణములు పైకెత్తి యుద్ధ మొన రింపమని ప్రోత్సహించి ఆదేశించి నాడు. ఇది అర్థంచేసికొనినట్లయిన ఆక్షేపణే ఉండదు. శాంతి ప్రతిష్ఠా పన కేవలము క్రియాకలాపములతో జరుగవలసిన కార్యం. అంతేగాని వేదికలపైకెక్కి, క్రియాశూన్యమైన ఉపన్యాసమిస్తే సాధింప బడ దు. "శాంతి మా లక్ష్యం" అని నినాద ములు చేస్తూ, అశాంతికి మార్గా లైన క్రియాకలాపాలుచేస్తూ ఉంటే అది నిజంగా శాంతికి సాధనంకాదు. అది బూటకం. అది నాటకం. మన అర్జునుడు అట్టి నాటకమే ఆడాడు. మోహావేశపరవశుడై గురుబాంధవ వధ ధర్మశాస్త్రంలో నిషిద్ధమని, అర్థశాస్త్రరీత్యా ఆతతాయి వధ విధింపబడినప్పటికిన్నీ అర్థశాస్త్రం కంటె ధర్మశాస్త్రం పరిగణనీయ మనే ఉద్దేశ్యంతో పండితునివలె తన పాండిత్య ప్రకర్ష వార్ష్ణేయునివద్ద ప్రక టింప నారంభించాడు. కాని దీనుని వలె, అజ్ఞానివలె, అపండితునివలె గాండీవము చేతినుండి జారుతుండగా దేహం దహించుకొని పోతుండగా అర్థరహితంగ విలపించాడు. అప్పుడు కృష్ణుడు చెప్పిన పలుకులు కేవలము అర్జునునికేగాక ప్రవృత్తి చిత్తులైన పండితులు కొందరు ప్ర శాం తి ని గుఱించి చెప్తూ అశాంతిపూరి త హృదయులై ఉంటూ ఉండేవా రందరికి చెందుతుంది.

సాంఖ్యయోగంలోని శాంతి సాధన కుపకరించే ముఖ్యవిషయము లను చర్చించుకుందాం.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః
సంగ స్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః
కామాత్ క్రోధోఽభిజాయతే॥

పురుషుడు విషయములను గుఱించి సదా చింతనము చేయుచు

న్నచోవానియందు ప్రీతి జనించును. దానివలన కామ మావిర్భవించును. కామజనితమే క్రోధము.

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః
సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో
బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥

జ్వలనాత్మకమగు క్రోధమువలన అవివేకముదయించును. అవివేకము వలన మతిభ్రమ జనించును. దాని వలన బుద్ధి నశించును. బుద్ధి నాశనము సర్వనాశనమునకు కారణభూతము.

వ్యక్తిగాని, వ్యక్తులసముదాయ స్వరూపమైన దేశంగాని అనాత్మకమైన బాహ్య విషయములను ఎల్లప్పుడూ ధ్యానిస్తూ ఉన్నట్లయిన నిశ్చయముగ వానియందు అభిలాషజనించును. ఆఅభిలాష లభ్యం కానప్పుడు క్రోధముదయించి కార్యాకార్య శూన్యత ఏర్పడి, బుద్ధి నాశనానికి సర్వనాశనానికి దారి తీస్తుంది. బుద్ధి నాశనమే అసలు అశాంతికి కారణము. కార్యాకార్య శూన్యత ఏర్పడినప్పుడు అశాంతి విలయతాండవం చేస్తుంది. తాండవంచేస్తున్న అశాంతిని ఖండించాలంటే భగవద్గీత ప్రసాదించిన పద్ధతి ప్రకారము క్రియాత్మక కృషి యొనరింపాలి. దానివలన శాంతి సంస్థాపింపబడుతుంది.

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిఃస్పృహః।
నిర్మమో నిరహంకారః
స శాంతి మధిగచ్ఛతి॥

సమస్తమైన కోర్కెలు త్యజించి తృష్ణ మమకారాహంకార రహితుడై విలసిల్లు పురుషునకు ప్రశాంతి ప్రాప్తించును.

ప్రశాంతి ప్రాప్తికి మూలకంద మీ శ్లోకము. మానవులలోను, మానవులమధ్య శాంతి సాధింపబడాలంటే ఈ శ్లోకాన్నే ఆశ్రయించాలి. ప్రథమంలో మానవులలోగాని, దేశాలలోగాని సోదర మానవులకు, సోదర దేశాలకు అశాంతి జనకములైన కోర్కెలు నశించాలి. ప్రక్కవారిని ప్రక్కదేశాన్ని నశింపజేయాలనే రక్తదాహంతో కూడిన తృష్ణ నశించాలి. ఇది నా దేశమని, ఇది నా రాష్ట్రమని, ఇది నా కుటుంబమని, ఇది నా దేహమనే అహంకారయుత మమకార మావిర్భవిస్తే తన దేశానికి, తన రాష్ట్రానికి, తన కుటుంబానికి, తన దేహానికి అన్యమైనవానియందు ద్వేషోదయము కలుగుతుంది. ద్వేషోదయమే అశాంతికి కారణము. అశాంతి నశించా

లంటే ద్వేషం నశించాలి. మమకార రహితమైన ప్రేమ జనించాలి. అప్పుడు శాంతి సాధింపబడుతుంది.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య
య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా
మిథ్యాచారస్స ఉచ్యతే॥

కర్మేంద్రియములను బలవంతముగాబిగపట్టి ఎవడుమనస్సుతోవిషయములను గుఱించి సమగ్రముగా విచారించునో అతడు మూఢుడని కపటాచారుడని చెప్పబడును.

పైనచెప్పబడిన కుటిలాచారుడు పయోముఖ విషకుంభము వంటివాడు. ఏ విషయములను 'నేనుత్యజింపగలిగినాను. సంయమింపగలిగినాను' అని చెప్పకలిగినాడో ఆ విషయములను గుఱించే అతడు తీవ్రముగా చింతించినయెడల అది యథార్థ సంయమనం కానేరదు. అతడు తనను తాను మోసంచేసికొని, ఇతరులను మోసంచేస్తున్నాడన్నమాట. "మేము మా హృదయంలో శాంతిని స్థాపిస్తాం. మా దేశంలో మా సమాజంలో శాంతిని సంస్థాపిస్తాం. కాదు — యావత్ప్రపంచంలోనే ప్రశాంతి ప్రతిష్ఠిస్తాం" అని బాహ్యాంగా చెప్తూ, అశాంతికి మార్గాలైన ఆలోచనలను మనస్సులో మననం చేస్తున్నట్లయిన అది మూఢాత్ముల లక్షణం. జటిలమైన కుటిలత్వము అశాంతికే త్రోవ చూపుతుంది. బాహ్యాంగా సంయమనం చేసినట్లు నటిస్తూ ఆంతరంగికంగా ఆ భావములనే చింతనచేస్తే అది సంయమనం యొక్క యథార్థతను గ్రహించినట్లు కాదు. ఇది ఇతరులలోనే కాదు. తమలో కూడ అశాంతిని రేకెత్తిస్తుంది. ఆంతరంగిక సంయమనం లేనప్పుడు అది బాహ్య సంయమనమునకు కూడ ద్రోహం చేస్తుంది. అంటే ఆంతరంగికంగా శాంతి సాధనలు చేయకుండ బాహ్యాంగా శాంతి సాధనలు చేసినట్లు బూటకం చేస్తే అవి శాంతిసాధనలుకావు—అశాంతి సాధనలు. అది అజ్ఞానుల లక్షణం. అది కుటిలుల లక్షణం. అట్టి లక్షణములుకలిగిన పయోముఖ విషకుంభములు ఎప్పుడూ శాంతి అమృతమును ప్రసాదింపలేవు.

కర్మ కర్మాగారమైన సృష్టిలో ఎటువంటి కర్మ చేయాలని ఆదేశించాడు కృష్ణుడు? సత్కర్మలు ఫలాపేక్షరహితబుద్ధితో, స్వార్థ రహిత బుద్ధితో, ఈశ్వరార్పణ బుద్ధితో చేయమని చెప్పాడు. ఇది శ్రీకృష్ణ ప్రవక్తప్రోక్త దివ్యసిద్ధాంతము. ఈ సిద్ధాంతమును శుద్ధాంతఃకరణ

ముతో ఆచరిస్తే అశాంతికి నిలువ నీడలేదు. "ఈ పని నాది. నేను చేస్తున్నాను" అనే కర్తృత్వబుద్ధితో ఏ కార్యమునైనను చేసినట్లయిన అహంకార మమకారము లావిర్భవిస్తాయి. అవి అశాంతికి కారకములైనవి. ఈశ్వరార్పణబుద్ధితో చేస్తే అహంకారమమకారాలు నశిస్తాయి. అవి నశించాయంటే అర్థం అశాంతికి మరణం, శాంతికి జననం జరిగిందనేగా !

కర్మయోగంలో మరొక విశేషముంది. సృష్టింపబడిన సృష్టికి, సృష్టిలో ఒకడైన చైతన్యస్వరూపుడైన వ్యక్తికి పరస్పరం సంబంధముండాలని కృష్ణుని సిద్ధాంతం. సృష్టిలో ఒకడై ఉంటూ సృష్టికి అన్యంగా నడుస్తూ, సృష్టితో సమన్వయంగా ఉండకపోవటం శ్రీకృష్ణుని మతంకాదు. అంటే సృష్టిలో పరస్పర సహకారంతో మెలగాలన్న మాట. సృష్టిలోని ఏ వస్తువుపైన ద్వేషవృత్తి ఆవిర్భవింపరాదన్న మాట. అలా ఉండి దానితో సమన్వయం చేసుకుంటూ, వాటి యథార్థతను అవగతం చేసుకుంటూ ముందుకు సాగిపోవాలి. ప్రభువు ప్రభుస్థితిలోనే ఉండాలి. కృషీవలుడు కృషీవలస్థితిలోనే ఉండాలి. ధర్మప్రచారకుడు ధర్మప్రచారకుని స్థితిలోనే ఉండాలి. వారు పరస్పరం సహకరించుకోవాలి. ఇలాంటి పరస్పర సహకారము, పరస్పర ప్రేమ లేకపోతే అశాంతి అంకురించే అవకాశములున్నాయి. శాంతి లభ్యం కావాలంటే సృష్టియందలి పరస్పర ప్రేమ సహకారాలభివృద్ధి చెందాలి.

శ్లో॥ ఉద్ధరే దాత్మనాఽఽత్మానం
నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధుః
ఆత్మైవ రిపురాత్మనః॥

ఆత్మచేత ఆత్మ నుద్ధరింపవలెను. ఆత్మను అధోగతి పాలొనరింపరాదు. ఆత్మకు ఆత్మేబంధువు. ఆత్మే శత్రువు.

ప్రథమంలో ఆత్మోద్ధరణకు పూనుకోనమని చెప్పటం, తన్ను తాను మరమ్మతుచేసుకోమని చెప్పటం ఈ శ్లోక ప్రధానలక్ష్యం. ప్రారంభంలోనే ఇతరులను ఉద్ధరించటానికి మరమ్మతు చేయటానికి పూనుకొనటం సనాతన సంప్రదాయ సిద్ధమైన లక్షణం కాదు. "స్వయం తీర్ణాః పరాంస్తారయంతి" అనికదా సూక్తి. ఇది ప్రతి వ్యక్తికి అవసరమైన ప్రబోధము. ఈ ప్రబోధము నవగత మొనరించుకొనినట్లయిన తమలో శాంతిని నెలకొల్పుకొని ఇతరుల హృదయా

లలో శాంతిని కలిగించటానికి ప్రయత్నం చేయటం, తమ దేశం అశాంతికి ఆలవాలమై ఉండగా పరదేశములలో ప్రశాంతి ప్రతిష్ఠకు కడంగటం అనేభావము లంతరిస్తాయి. ఆత్మోద్ధరణ రహితులు పరోద్ధరణకు పూనుకొంటె "నీ స్థితేమిటిభాయి! మాస్థితిగతులను విచారిస్తున్నావ్" అనే విమర్శకు పాత్రులౌతారు. ఎవరికి వారు, ఏసమాజానికాసమాజం, ఏదేశాని కాదేశం తమ నుద్ధరించుకొనేందుకు ప్రథమంలో పూనుకోవాలి. అన్యోద్ధరణ తరువాత!

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణాః
బోధయంతః పరస్పరం।
కథయంతశ్చ మాం నిత్యం
తుష్యంతి చ రమంతి చ॥

భక్తులు తమ చిత్తములు తమ ప్రాణములు నాకధీనమొనర్చి సదా పరస్పరము నాతత్వమును కథలవలె చెప్పుకొనుచు, సంతుష్టులగుచూ, క్రీడించుచుందురు.

వారు తమ చిత్త ప్రాణాదులు పరమాత్మకు ధారాదత్తం చేసినారంటే అర్థం ఏమిటి? వారి చిత్తప్రాణాదులలో భగవానునికే స్థానం ఉన్నదన్నమాట. భగవానునికే చిత్తప్రాణాదులలో స్థాన మెందుకివ్వాలి? మరొకరికి ఇవ్వకూడదా? అనిప్రశ్న. అతడుసచ్చిదానంద స్వరూపుడు కాబట్టి అతనిలో "సత్" అంటే "సత్యం" (eternal truth) "చిత్" అంటే "జ్ఞానం" (real knowledge) "ఆనంద" అంటే "సంతోషం" (everlasting bliss) మేళనం చెంది ఉంటాయి. ఈ గుణములు మూడు మానవునిలో మేళనమైనప్పుడు అతడు మాధవుడు కాగల్గుతాడు. ఏ ఒక్కటి లోపించినా విమర్శింపటానికి అవకాశం ఏర్పడుతుంది. ఆ విమర్శింపటానికి అవకాశంలేని సమగ్రస్వరూపుడైన సర్వజ్ఞ భగవానుడే మన చిత్తాదులలో ఉండాలన్నమాట. అదేఆనందదాయకము. ఆ ఆనంద దాయక తత్వాన్ని ప్రతిపాదించే ఉపనిషదాదులను పరస్పరం చెప్పుకోవాలి. అది సంతుష్టిని కలిగిస్తుంది. ఆ అనుభవానందమును ప్రసాదించే తత్వాస్రవంతిలో క్రీడించాలి. అది మనలను సత్యస్వరూపులుగా, జ్ఞానస్వరూపులుగా, ఆనందస్వరూపులుగా మారుస్తుంది. ఈ మూడు స్వరూపాల ఏకత్వమే శాంతి. శాంతి కావాలంటే యథార్థతత్వము నవగతము చేసికొని భగవానులు కావటానికి ప్రయత్నించాలి.

"అహం సర్వస్య ప్రభవః" నేనన్నిటికని కారణమని విభూతి యోగంలో చెప్పినట్లుగా, యథార్థ తత్వము నవగతము చేసికొన్నట్లయిన సర్వ ప్రపంచము ప్రేమమయమైపోతుంది. దీనినిబట్టి మన మేమి అర్థం చేసుకోగలుగుతాం? నిమిత్తకారణుడైన పరమాత్మ ఈ సృష్టి అనే ఉపాదాన కారణంగా కూడ భాసిస్తున్నాడన్న మాట. ఇక్కడ ఒక చిన్న చిక్కు ఉంది. ద్వంద్వములతోకూడిన సృష్టికూడ బ్రహ్మస్వరూపమే "ఏకోదేవస్సర్వ భూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వ భూతాంతరాత్మా" అనే శ్రుతి సూకిచేత. కాని సృష్టి సహజ లక్షణములైన షడ్వికార ద్వంద్వాది గుణములు పరబ్రహ్మ అధ్యస్తం చేయకూడదు. అంటే ఈ గుణాలు పరమాత్మకు ఆపాదింపరాదన్న మాట. అందువలన సృష్టి భగవాను నిలో అంతర్లీనమేగాని, సృష్టి వికారములకన్న అతడు విలక్షణుడు అని మనం నిర్ణయించుకోనవలసి ఉంటుంది. ఇట్టి జ్ఞానం మనకు కలిగినట్లయితే భగవానుడు చెప్పిన తన విభూతులయొక్క, విశ్వరూప ప్రకటనముయొక్క తత్వము మన కవగత మౌతుంది. ఆ తత్వం ద్వేష రాహిత్యాన్ని, ప్రేమోదయాన్ని కలిగిస్తుంది. అది శాంతిని మనకు

ఈ విధముగా భగవానుడు చెప్పిన భగవద్గీతను భక్తితో, ఆసక్తితో నిశ్చయంగా ప్రశాంతి ప్రసాదిస్తుంది. ప్రశాంతిని ప్రతిష్ఠింపజేసే భగవద్గీతను మననం చేసికొని, మన జీవితములను ధన్యమొనరించుకొనెదముగాక! గీతామాత శాంతి వాణిని వినెదముగాక! విశ్వశాంతి గీతికలను గానము చేసెదముగాక!

ఓం తత్సత్.

— ఆచార్య శ్రీధర్.

---

గీత చెప్పిన కర్మలో జ్ఞానప్రభవుంది. భక్తి మాధుర్యంవుంది. గీతా ప్రకాశ ప్రభావమున ప్రతియొక్క కర్మక్షేత్రమూ ఉజ్జ్వలమై మెఱసి పోగలదు.



శ్రీరామ.

## శ్రీ బ్రహ్మచారి రామకృష్ణయ్య సద్గురువులవారి

# అభినందన శశికళ.

సీసమాలిక:

వేదాంతవీథుల విహరించు విజ్ఞానధుర్యులౌ బ్రహ్మవిద్యాఖ్యులొకట!
తనవారలన్యులంచును దలంపక నొక్క ధర్మంబుఁ గా జూచు ధన్యులొకట!
జాతి మత వివక్షయేతతిలేకను సమముగా మెలఁగెడు సరసులొకట!
అల కుచేలునకైన యప్పు నాటికి బేడవడ్డిలో నిచ్చెడువారలొకట!
పరసతులను మాతృభావంబుఁగాఁ జూచి విఖ్యాతిఁ గాంచిన విజ్ఞులొకట!
అనసూయ సావిత్రి యవనిజాసతులకు సాటియై వెలసిన సతులునొకట!

గీ॥ వెలయు శ్రీరామకృష్ణయ్య విమలవాక్య ♦ సుధను గ్రోలుచు సభికులు చొక్కుచుండ
శారదాపూర్ణిమదినంబు చంద్రుఁడెట్లు ♦ వెలుఁగుచుండునో యారీతి వెలిగె సభయు 1

గీ॥ అర్జునుండాహవంబున నంపగముల ♦ బఱపినట్లుండె విషయసంభరితమగుచు
బ్రహ్మచారులలో నింతప్రౌఢుఁలైన ♦ వారిఁ గనుఁగొనలేదింతవరకు నెందు. 2

క॥ తేనియతేటలు మాటలు ♦ సాన తయారైన బ్రహ్మజాతిరతనముల్
మానిత వజ్రపుమూటలు ♦ గా నొప్పు యథార్థమంచు గణుతింతు సభన్. 3

క॥ భగవద్గీతార్థంబును ♦ నగణితముగఁ జెప్పునట్టి యందఱిలోనన్
నిగమనిగమాంతములఁగల ♦ సొగసగు పదములనుకూర్చి సొంపుగ చెప్పెన్. 4

( 14_వ పుట శేషము. )

మెట్లతో పనిలేనట్లు — జ్ఞానమే తానైనున్న జ్ఞానికి — నిత్యనైమిత్తిక కర్మలతో ఏమియు పనిలేదు. ఏల అన — అగ్గిపుల్ల గీచిన తరువాత — మిగిలినపుల్ల ఎలా కాలిపోవునో — జ్ఞానాగ్ని జ్ఞానిదేహాన్ని అట్లు దగ్ధముచేయును. అనగా జ్ఞానికి దేహం, మనసు, బుద్ధి చిదాభాసుడు జడముగా కనబడును. జ్ఞానమను గమ్యం చేరుటకు, నిత్యనైమిత్తిక కర్మలను దారిని నడువవలసినదే. కాని గమ్యం చేరిన తరువాత దారితో పనిలేదు. అట్లే కర్మజ్ఞానములకు అవినాభావ సంబంధమున్నను, మేడ — మెట్లవలె, దారి — గమ్యంవలె వేరువేరేగాని సముచ్చయములు కావు.

— మందుల కోటయ్య.



గీ॥ భాగవతులెల్ల మిక్కిలి ప్రస్తుతింప ♦ యఖిలజనులకు నామోదమావహింప
ప్రేమఁ జెప్పెను శ్రీరామకృష్ణబ్రహ్మ ♦ చారి భాగవతంబును సంస్తుతింతు. 5

క॥ అభిమానముచే పొగడను ♦ సభికులార మీకు నెంతొ సమ్మోదమొదవన్
రభసము వెలయఁగ జెప్పెను ♦ రసికమైన వాక్యరచన రాణింపంగన్. 6

క॥ ఐదాఱుభాషలను బహు ♦ సాదరభావంబుతోడఁ జర్చించియు స
మ్మోదమున వానిలోఁగల ♦ వేదాంతము వెల్లివిరియ వినిపించెనిటన్. 7

గీ॥ తేనె మామిడి పండ్లను దినినయప్పు ♦ డెంత రుచి జిహ్వ బొందునో యంతయింపు
శ్రవణయుగ్మంబులకుఁ గల్గె సభికులార ♦ చెప్పనేల యథార్థమై యొప్పుగులుక. 8

గీ॥ మందహాసంబు మొగమున జాదులాడ ♦ హృదయ మామోదభరితమై యింపునింప
సభికుల మనంబులెల్లను జల్లపడఁగ ♦ జెప్పె భాగవతంబును మెప్పువెలయ. 9

క॥ పౌరాణికశబ్దముదను ♦ జేరియు వెనువెంటనంటి శ్రేయము లొసగన్
పౌరాణికుల న్ననునిటు ♦ నేరుపుతోఁ జెప్పువారె? నిఖిలార్థవిదుల్. 10

ఆ॥వె॥ బ్రహ్మవిద్వరిష్ఠ భాషాపరాశేష ♦ భోగితుల్య నిన్ను పూర్ణమైన
భక్తిచేత నెమ్మ ప్రస్తుతిఁజేసి నే ♦ మ్రొక్కుచున్న నాదు మ్రొక్కుఁ గొనుము 11

చం॥ సనకసనందనాది మునిసత్తము లెల్లరు ధర్మమార్గముల్
ఘనులకుఁ దెల్పినారొ యటు కమ్మనివాక్కులఁదెల్పి బ్రహ్మమున్
గనుఁగొనునట్టి మార్గమును ఖండితరీతి నుపన్యసించి మా
మనముల చల్లఁజేసితివి మాన్యగుణాకర నీతికోవిదా. 12

గీ॥ బ్రహ్మచర్యాశ్రమంబున ప్రౌఢుఁడనఁగ ♦ బరగు భీష్ముని కెనయైన ప్రజ్ఞ కలిగి
పుణ్యభూములు దిరిగి సంపూర్ణమైన ♦ సంగతు లెఱింగివచ్చితో సదయహృదయ 13

క॥ భగవానుఁడు శ్రీకృష్ణుఁడు ♦ జగతిని నెల్లపుడు నీకు చక్కఁగ తోడై
నెగడఁగ జేయుటకొఱకై ♦ యగణితముగ సన్నుతింతు నార్యస్తుత్యున్. 14

క॥ అడిగినవారలకెల్లను ♦ తడవు సేయ కెఱుకపఱచు తలఁపుగలిఁగియున్
నుడివెదవు సందియంబులు ♦ కడుపడిగా దీఱునట్లు కరుణావార్ధీ 15

క॥ శశికళఁ గైకొనుసూర్యా ♦ పశుపతి పార్వతియు నీకు బహుళప్రేమన్
వశులయ్యు బ్రహ్మవిద్యను ♦ విశదమ్ముగఁ దెల్పుచుండ్రు విమలగుణాఢ్యా. 16

ఇట్లు,

బ్రహ్మచారి శ్రీరామకృష్ణార్యాభిలాషి,

బడబాగ్ని నారాయణరాజు,

ప్రొద్దటూరు.

# ★ స్వస్వరూపజ్ఞానము. ★

వేదాంతపితామహులగు శ్రీ రాజేశ్వరానందస్వాములవారు, M.A., D.Litt.
సంపాదకులు – The Call Divine.



[ గత సంచిక 24వ పుట తరువాయి. ]

భౌతిక దృష్టియనఁగా నామరూపములె సత్యమను యనుభవము. దైవికదృష్టి యనఁగా నాస్తిక్యబుద్ధిమొదలుకొని యాత్మానాత్మ వివేకముద్వారా స్వరూపసాక్షాత్కారమువరకు నుండునది. పారమార్థిక దృష్టియనఁగా సచ్చిదానందానుభవము.

పశుపక్ష్యాది ప్రాణులకుఁ దాము పశువులమని, పక్షులమని, యీగలమని, దోమలమని తెలిసికొనుజ్ఞానము లేదు.

మానవులమైన మనకుమాత్రమే మనము మనుష్యులమనియు, నివి పశువులనియు, పక్షులనియు, దిర్యగాది జంతువులనియుఁ దెలిసికొను జ్ఞానముకలదు. ఈ జ్ఞానమొక్కటి మనకధికముగా నుండుటచేతనే జ్ఞానములేని ప్రాణులన్నియు మనస్వాధీనములై యున్నవి. ఈ జ్ఞానమువలననే మానవుఁడధికుఁడుగాను, శక్తిసంపన్నుఁడుగాను నున్నాఁడు. ఈ జ్ఞానము మానవునియందెంత యెక్కువగా నుండునో యనఁగా జ్ఞానమూర్తిని కెంత సామీప్యమున నుండిన నంతశ్రేష్ఠత్వము వృద్ధియగుచుండును. కావున నిట్టిజ్ఞాన విచారణ యవశ్యకర్తవ్యమగుచున్నది; యోగ్యము నగుచున్నది. అనన్యప్రబోధముచేతనే పరమాత్మ దర్శనమగును. ఇతర విధముగ నిట్టి జ్ఞానమలవడదు. ఇతరజ్ఞానమువలన పరమాత్మ దర్శనము కానేరదు. భగవంతుని దర్శించునట్టి జ్ఞానమునకే జ్ఞానమనిపేరు. తక్కిన వస్తుజ్ఞానములన్నియు నజ్ఞాన జన్యములే. కావున నభిన్నబుద్ధిచేతను, యభిన్నజ్ఞానముచేతను చూచిననే భగవంతుని చూడగలుగుదవు.

ఆకాశముయొక్క భావముగాని, యభావముగాని బుద్ధికి గోచరించునట్లు కాన్పించుచున్నది. అట్లే ఆకాశవిహీనమగు శుద్ధ తత్త్వపదార్థముగూడ బుద్ధికిం గోచరమగునా కాదాయని సంశయింపవచ్చును. ఆకాశమును భూమ్యాదులనుండి విభాగింపవచ్చునుగాని, సత్పదార్థమిట్టిదికాదు. ఆకాశము ప్రపంచరహితముగాఁ గానవచ్చుటలేదు. ఎంతగా విభాగించినను యాకాశము తేజస్సుతోఁగాని, చీఁకటితోఁగాని కలసియే యుండును. కావున నాకాశము ప్రపంచ సహితముగనే కానవచ్చును. ప్రపంచరహిత కేవలాకాశభావము బుద్ధికిలేదు. ఆకాశరహిత సత్పదార్థానుభవమును లేదు. అభిధావృత్తిచేగాని, వ్యంజనావృత్తిచేగాని వాక్యము తన తాత్పర్యమును వెల్లడించును. అభిధావృత్తి ప్రసిద్ధ పదములచేతను, లక్షణావృత్తి యూహచేతను, వ్యంజనావృత్తి యొక్క యర్థమును జెప్పుచు మఱియొక యర్థమును స్ఫురింపజేయుటచేతను, తన తాత్పర్యము ననఁగా హృదయమును వెల్లడిచేయును. ఈ మూడు వృత్తులతోఁ దాత్పర్యమును ప్రకటించి నంత

మాత్రమున వాక్యమునకు ప్రామాణ్యమురాదు. ఆత్మకు భిన్నముగా మహావాక్యము కలదనుటయు, నాత్మను యూహించి చెప్పుట యనుటయుం గల్పనామాత్రమే యని పరమతాత్పర్యము. ఆత్మ బోధస్వరూపమేగాని, బోధవిషయ మెన్నటికిఁగాదు. ఆత్మను యెఱుఁగునది మఱియొకటిలేదు. ఆత్మయే సర్వమును నెఱుంగునది. ఆత్మ సాధన సాధ్యమైనదకాదు. సర్వసాధనములు దృశ్యములందుఁ జెల్లును. దృక్కునందుఁ జెల్లవు. దృక్కనినను, దృగ్రూపమనినను, అనుభవమనినను, స్వయంప్రకాశమనినను నొక్కటియే. ఆత్మకంటె వేఱుగు ద్రష్టలేదు. స్వప్రకాశత్వమాత్మకు సహజలక్షణము. అనుభవ మనుభవ విషయము కాకపోయినను స్వతస్సిద్ధమై స్వయంప్రకాశమైయున్నది.

ఇష్టవస్తువును జూచుటవలన గలిగిన సంతోషమునకు ప్రియమనియు, నిష్టవస్తువు లభించుటచేతఁ గలిగెడి సంతోషమునకు మోదమనియు, నిష్టవస్తువును యనుభవించుట వలనఁ గలిగిన సంతసమునకు ప్రమోదమనియు నందురు. ఈ ప్రియామోద ప్రమోదము లనెడి సుఖవిశేషవృత్తులచేతఁ జెప్పఁడగిన నానందమయము బుద్ధియందు ప్రతిబింబరూపముగా వర్తింపుచున్నది. అట్టి యానందమయమనెడి ప్రతిబింబమున కాధారమానంద బింబమైనది. సర్వకాల సర్వావస్థలయందును నిత్యశుద్ధ, బుద్ధ, ముక్త, నిష్కళ, నిష్క్రియ నిర్గుణ పరిపూర్ణ చైతన్యస్వరూపమై యాత్మగానున్నది. ఆనందమయకోశ ముత్పత్తి లయములు కలిగియుండుటచే నిత్యమైన యాత్మకాజాలదు.

తెలివి యనునది ప్రకాశింపక, దెలియబడునదనునది సంభవించదు. దృక్కు ప్రకాశింపక దృశ్యము గోచరించదు. స్వప్రకాశమగు జ్ఞానమే సహజస్థితి. ఏయే పదార్థముల యందు నామరూప ఘటపటాదిబోధ (జ్ఞానము) కలుగునో, దృశ్యపదార్థములను త్యజించి యోగ్యతమమైన బోధమమాత్రమే స్వీకరింపఁదగినది. సర్వపదార్థము లాంతర బాహ్యములయందును సర్వవ్యాపకమైన చైతన్యమే తన స్వరూపమైన దృక్కు. తదితరము లన్నియు నాగంతుకములుగా, మాయికములుగా నారోపింపఁబడిన దృశ్యములు. గారడివాని విద్యచేత గల్పింపఁబడిన గంధర్వ నగర మాకసమున కెట్లు యథార్థమైన పరిచ్ఛేదము గలిగింపజాలదో, యట్లే దేశకాలవస్తుకృత పరిచ్ఛేదములు, జీవేశ్వర జగజ్జాలములు, తన స్వరూపబ్రహ్మమునందు కల్పింపబడుటచే నెట్టి పరిచ్ఛేదము గలిగింపజాలవు.

భేదము పారమార్థికము కాదు. ప్రపంచము చేతన జడరూపము. అందు చేతనులు జీవులు. తక్కిన ప్రపంచము జడము. చేతనమున జీవేశ్వర రూపములు రెండు నొక్కటియే. జడప్రపంచము కేవలము నామరూపాత్మకమే. నామరూపములను విభాగించిన యెడల సద్రూప చిద్రూపానంద రూపములకంటె భిన్నమగు పదార్థమేదియును లేదు. ఒక్క పదార్థమునే యనేక నామరూపములతోఁ జూచుటయు పరమార్థము కాదు. నామరూపములకు భేదము సహజస్వభావము. కాని, సద్రూపమునకు భేదములేదు. అవాఙ్మానసగోచరుఁడైన సద్రూప పరమాత్మవిషయమై వక్తగాని, శ్రోతగాని లేదు,

ఏకస్వరూపునింగూర్చి చెప్పందగిన విషయమే లేదు. గురు శిష్య భేదము నిమిత్త మాత్రము. ఆభేదస్వరూప మఖండమగను, భూమాస్వరూపముగను నుండును. అందులో భేదమేమి యునులేదు. శిష్యుఁడజ్ఞుఁడు గనుక వాని చిత్తమున లోకవ్యవహారముల సంస్కారము లుండుటచే జిత్తదార్ఢ్యమునకై జేయంబడు శాస్త్రవిచారణయు, ప్రశ్నోత్తరములును, ద్వైతమును యాశ్రయించనివై యున్నవి. భేదవాసనా యుక్తుఁడైన జీవేశ్వర జగద్భేదములనువదించి, యవి పారమార్థికము గాలేవని యుపదేశింపబడుచున్నది

ఇట్టి జ్ఞానము శాస్త్రాచార్యోపదేశము చేతనే తెలియంబడును. గురూపదేశ పూర్వకముగనే విషయము తెలిసికొనుటచే నీలోకమున శ్రవణవిషయము కాని పదార్థము గూడ శ్రవణము చేయఁబడినదిగాను, మననమునకు విషయమై మననము చేయబడక నుండెడి పదార్థముగూడ మననము చేయంబడినదిగాను, నిదిధ్యాసము జేయంబడకుండెడి పదార్థముగూడ నిశ్చయింపఁబడినదిగాను యేర్పడుచున్నదో యట్టి విషయమై యఖండా నందాద్వితీయ పరమాత్మ జ్యోతిస్స్వరూపమై యున్నయది.

స్థావరజంగమరూపమైన భూతముల కాశ్రయమై, ఆధారమై పృథివియున్నది. గనుక సారమైనది. ఓతప్రోతరూపమై బాహ్యాభ్యంతరములందు వ్యాపించియుండు జలము పృథివికిం గారణమై సారముగనున్నయది. ఓషధులు జలముచేత నుద్భవించు చున్నందున జలముయొక్క సారమైయున్నది. ఓషధు లన్నముద్వారా శరీరముగుచు నోషధులయొక్క సారము పురుషదేహమైయున్నది. పురుషునియందు వాక్కు శ్రేష్ఠ మైనది. కనుక, బురుషశరీరముయొక్క సారము వాక్కగుచున్నది. వాక్కులందు ఋగాత్మకమైన మంత్రములు గంభీరార్థములతో నిండియున్నవి. గనుక వాక్కుయొక్క సారము ఋక్కులు, ఋగ్రూపములైన మంత్రములకంటె సామగానము వక్తృత్వమునకు శ్రోతృత్వమునకు సుఖకరమైనది గావున ఋక్కులయొక్కసారము సామమైనది. సామ గానములందుదీర్ఘము శబ్దోపలక్షితమై, సారతరమై యోంకారమైనది. ఈ యుద్గీథ మింకను, "తత్, త్వం" యనునట్టి మహావాక్యములచే సారతమమైనది. ఉత్కృష్టతమ మైన సారభూసామమునందుండుటంజేసియే శ్రీకృష్ణుఁడు గీతాశాస్త్రమున సమస్తవేదము లలో సామవేదమును నేనని పలికినాఁడు.

ఆత్మస్వరూప మింద్రియజన్యజ్ఞానముచేతఁ దెలియబడునదిగాదు. అయినను సాక్షాత్ప్రత్యక్షముగ "అహం" మని స్ఫురించుచుండుటచేత స్వప్రకాశమైనది, సద్రూప చిద్రూపానందరూపమైనది గాన, నాత్మకు బ్రహ్మాత్వము స్వతస్సిద్ధము. దృశ్యముల నిదిగాదిదిగాదని నిషేధించుచుఁ బోవగా చివరకేమియును లేదని తెలిసికొనునది జ్ఞానాత్మ. ఈప్రత్యగాత్మ కట్టకడపట సర్వభావమును గుర్తించునట్టి జ్ఞానముగానున్నది. ఇవ్విధమున నన్నింటిని నిషేధించునది ప్రత్యగాత్మ యగుట దీనినిట్టిదని చెప్పుటకు వీలులేదు. అట్టి యాత్మ తార్కికులచే నిరాకరింపఁ బడకయుండును. (సశేషము)

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూలు జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు – 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదూర్తి, – 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, – 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. – 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, – 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, – 7. శ్రీ తొమ్మంద్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. – 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, ఎం. కృష్ణాపురము, – 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. – 10. స్వర్గీయ శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, – 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల.– 12. శ్రీబొల్లు పల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల,

కడపజిల్లా: 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, – 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్.ఎస్. – 15. శ్రీపోశే పల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

అనంతపురం జిల్లా; 16. పూజ్యపాద శ్రీ చిద్గగనానంద మహారులవారు, శ్రీ భవ నాశి ఆశ్రమం. – 17. శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. – 18. శ్రీ పి. నర సింహశాస్త్రిగారు, కల్యాణపురం.

చిత్తూరు జిల్లా: 19. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, చిత్తూరు. – 20. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, చిత్తూరు.

నెల్లూరుజిల్లా: 21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, నెల్లూరు. – 22. శ్రీ వేమా రెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

కృష్ణాజిల్లా: 24. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. – 25. శ్రీ భట్టిప్రోలు సత్యనారాయణరావుగారు, సర్కిల్ పేట, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 26. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి. – 27. శ్రీ సమయమంతుల ప్రకాశంగారు – సుబ్బమ్మగారి స్మారకముగ కుమారుడు శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి – 28. స్వర్గీయ సమయమంతుల మాణిక్యమ్మ కుమారుడు రామకృష్ణగారి స్మారకముగ తండ్రి శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి. – 29. శ్రీమాతం శెట్టి వెంకటరత్నం – శేషమ్మగార్ల స్మరణార్థం కుమారుడు జగ్గారావుగారు ర్యాలి. – 30. శ్రీ సమయమంతుల సత్యనారాయణ – వెంకటసుబ్బమ్మగార్ల స్మారకముగ శ్రీ నాగేశ్వరరావుగారు, రాధాకృష్ణరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా: 31. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు, పాలకొల్లు. – 32, స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ – భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

నైజాంస్టేట్: 33. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. – 34. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ – 35. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం, కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

మైసూరుస్టేట్: 36. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్ – 37. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పేట – 38. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. – 39. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, – 40. శ్రీ జి. ఎస్. శంకరనారాయణ బ్రదర్సు, బెంగుళూరు సిటీ.

మద్రాస్ రాష్ట్రం: 41. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానల్లూరు, – 42. శ్రీగంథే నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యపురాజుగారు, గోసపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. – 7. డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. – 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె. – 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె. – 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. – 11. శ్రీజూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల. – 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, పాణ్యాం. – 16. శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరు. – 17. శ్రీ జి. సి. బాలన్నగారు, ఆళ్లగడ్డ. – 18. శ్రీ యం. చిన్నఈశ్వరరెడ్డిగారు, ఐలూరు, 19. శ్రీ కృష్ణం గురవయ్యశ్రేష్ఠిగారు, మర్చంట్, చాగలమర్రి. – 20. ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మగారి స్మరణార్థం భర్త మాఖం సుబ్రహ్మణ్యంగారు, నంద్యాల.

కడప జిల్లా: 21. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు. – 22. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. – 23. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 24. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు,

వేంపల్లి. — 25. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 26. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు.

అనంతపురం జిల్లా: 27. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 28 శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 29. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 30. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 31. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, — 32. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 33. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 35. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. — 36. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 39. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 40. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. — 41. శ్రీపాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి. — 42. శ్రీమ్యాడం అశ్వత్థప్పగారు, కల్యాణదుర్గం. — 43. శ్రీ కానుల శరభయ్యశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 44. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్పశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 45. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడుగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 46. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 47. శ్రీ బల్లా లెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 48. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఏ., పెరియంబాడి. 49. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

నెల్లూరు జిల్లా: 50. బ్రహ్మచారి శ్రీ బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము. కనుపర్తిపాడు. — 51. శ్రీ జూపల్లి సూర్యప్రకాశరావుగారు, జూపల్లివారి నగరి, వెంకటగిరిటౌన్.

కృష్ణా జిల్లా: 52. ముక్తామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. — 53. శ్రీ బొవినేని రామకోటయ్యచౌదరిగారు, పరమాత్మానందాశ్రమము, పెనమలూరు. — 54. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. బందరు. — 55. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 56. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. 57. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 58. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 59. శ్రీ మాతంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 60. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి. — 61 శ్రీసమయమంతుల వెంకటరత్నం నాగమ్మగార్ల & రామన్న మాణిక్యాంబగారి స్మారకముగ శ్రీ వెంకటసుబ్బారావుగారు, ర్యాలి — 62 శ్రీ సమయమంతుల జగ్గన్న కుమారులు జగ్గారావు, బుచ్చిరాజు, వెంకటరత్నంగారు, ర్యాలి. — 63. శ్రీ మానేపల్లి వీరభద్రరావుగారు, ర్యాలి.

పశ్చిమగోదావరి జిల్లా: 64. శ్రీ ఆబోతుల రామన్న గారు, పాలకొల్లు. – 65. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

నైజాం స్టేట్: 66. శ్రీ పి. వి. రంగారావుగారు, నల్గొండ. – 67. శ్రీదేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. – 68. శ్రీ నాగబండి విశ్వనాధంగారు, వరంగల్. – 69. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి,వరంగల్. – 70. శ్రీ గంటె రాజయ్యగారి లింగయ్యగారు, వరంగల్. – 71. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, వరంగల్. – 72. శ్రీతాటికొండ నాగయ్యగారు, వరంగల్. – 73. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, వరంగల్. – 74. శ్రీ మదూరు బసవలింగంగారు, వరంగల్. – 75. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్. – 76. శ్రీయాదా నారాయణగారు, వరంగల్. – 77. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు, వరంగల్. – 78. శ్రీ తోటి జగన్నాధంగారి ముక్తేశ్వర్ గారు, వరంగల్. – 79. శ్రీగన్ను బుచ్చయ్యగారు, వరంగల్. – 80. శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, వరంగల్. – 81. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ – 82. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ – 83. శ్రీ చండా పుల్లయ్యగారు, వరంగల్ – 84. శ్రీ చిదిరాల రాజశేఖరం గారు, వరంగల్ – 85. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, వరంగల్.

మైసూర్ రాష్ట్రం: 86. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 87. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 88. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 89. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 90. శ్రీ నారాయణమూర్తిగారు, c/o నూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. – 91. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి. – 92. శ్రీమతి కుసుమ భాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

మద్రాసు రాష్ట్రం: 93 శ్రీ శంకరనాయుడుగారు, కార్వేటి, నార్త్ఆర్కాడు జిల్లా. – 94. శ్రీ సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం, కోయంబత్తూరుజిల్లా.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.
2. శ్రీ గజ్జహల్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మగారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.
4. కోనూరి సూరమ్మగారు, వెదిరేశ్వరం, తూర్పు గోదావరి.

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# మేలుకొలుపుపాట.



భూపాలరాగం.

గీతామాతా మేలుకొనవే పూతచరితా మేలుకొనవే
దాతవై మము బ్రోవ భగవద్గీత మేల్కొనవే ॥గీ॥

యెన్ని జన్మములాయె మేమూ నిన్ను విడచి తిరుగబట్టి
యెన్నటికి నీదాపు జేర్తుమో, నోరు బల్కవదే ॥గీ॥

జననివగు నీమహిమ తెలియక, అన్యాయమును మద
మత్సరంబుల దవిలి తిరిగెడి నీదు సుతులను కరుణ బ్రోవగనూ॥గీ॥

ఘోరమగు సంసారజలధి తీరమును జేర్పంగజాలెడు
నావనీవని నమ్మితిమి గతినీవే మా కెపుడూ ॥గీ॥

పూర్ణమాయసి నీ తత్వమును గ్రహియింపజాలని నీదు సుతు
లకు నీదు స్మరణమె చాలునని బుధులెల్ల బల్కిరిగా ॥గీ॥

నీవు నిద్దుర లేవకుండిన లోకమెల్లను నిదురజెందెను
కావుమను హరిదాసికిని సుజ్ఞాన మొసగగనూ ॥గీ॥

నల్లాన్ చక్రవర్తుల వెంకటలక్ష్మమ్మ:




ॐ

[illegible]

★

మేలుకొను గీతామాతా మేలుకొను జ్ఞానప్రపూతా
మేలుకొను భగవచ్ఛ్రీముఖపద్మసంజాతా మేలుకొను గీతామాతా॥

ఉపనిషత్తులె గోవులనగా పార్థునదె వత్సంబుగాగా
దోగ్ధహరిక్షీరంబులుగ నిను పితుక నిలచెనుగా ॥మే॥

తత్వవృష్టిని గురిసి వేగమె నిత్యవస్తుజ్ఞానమొసగియు
తృష్ణయను బంధంబు బాపియు తృప్తినొసగగనూ ॥మే॥

యీషణత్రయములను జిక్కియు వేసటయు బొందెనా
సుతులను దోసమెంచను జననిహృదయము నీకు తగునటవే ॥మే॥

నీదు హృదయమె ఉపనిషత్తులు నీదు కరుణయె బ్రహ్మ
విద్యయు నీదు వాణియె యోగశాస్త్రము నీవె హరినిలయం॥మే॥

నరుడె నీసుతుడనగ నెంచితో జగమదెల్లను నీకుటుంబమె
దురితమెల్లను బాపి శ్రీహరిదాసి నేలగనూ ॥మే॥

నల్లాన్ చక్రవర్తుల వెంకటలక్ష్మమ్మ.
మార్కాపురం, కర్నూలు జిల్లా.

శ్రీవేదవ్యాస ప్రెస్, చిత్తూరు, మార్చి 1955 కా. 1000.